విడిపత్రిక ౧ అణా

# గోలకొండపత్రిక

103222

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ | అక్టోబరు 17 వ తేది 1935 గురువారము | అర్ధ సం॥ చందా రూ. ౩

సంపుటము ౧౦. | తూపుబజారు, హైద్రాబాదు - దక్కన్. శా. శ. ౧౮౫౭ శ్రీ యువ సం॥ ఆశ్వీయుజ బ॥ ౬. గురువారము. ఆజూరు ౧౧ ౧౩౪౪ ఫ. | సంచిక ౪౪

# ఇటలీ ఆబిసీనియాల యుద్ధము

## ఇటలీ సోమాలీలు ఆబిసీనియా పక్షమున చేరుట

### ఆబిసీనియా యుద్ధము తాత్కాలికముగ ఆగుట

### ఆక్సుము నగరము

స్వాధీన మగుట

రోము: అక్టోబరు ౧౪:—

పుణ్యక్షేత్రమగు ఆక్సుము నగరపు కోటబీగములను, నగరపుబిషపు ఇటలీ సైన్యాధిపతి డెల్‌బోనోగారి కొసగి ఇటలీ సైన్యాధిపతి ఆధిపత్యమును అంగీకరించిరని అడోవనుండి రూటరువార్త వచ్చినది. ఈ నగరము పుణ్యక్షేత్రమగుటచే ఇటలీయులు నగరముపై బాంబులను వేయలేదు.

* * * *

ఆగ్నేయపు సరిహద్దులవద్ద యుద్ధము

రోము: అక్టోబరు ౧౪:—

ఆబిసీనియా ఆగ్నేయపు సరిహద్దులవద్ద అనగా ఇటలీవారి సోమాలిలాండును బ్రిటిషు సోమలిలాండును కలియు ప్రదేశముదగ్గర ఇటలీ సేనలకును మిజర్టీను సోమలిజాతులకును యుద్ధము జరుగుచున్నట్లు దగహాబురునుండి వార్తలువచ్చినవి. బ్రిటిషు సోమలిలాండు జాతులలో నొకటియగు డోల్బాంట జాతివారు మిజరుటీను సోమలి జాతులతో కలసి ఇటలీసేనల నెదిరించి పోరాడిరి. బ్రిటిషు సోమలిలాండు జాతులు పోరాటమునకు గడంగ కూడదనియు, అట్లొనర్చినవారికి బ్రిటిషు సంరక్షణము ఇవ్వబడదనియు ప్రకటన గావింపబడినను ఈ ప్రకటనకు విరుద్ధముగ ఈ జాతివారు యిటలీ సేనలతో పోరాడిరి. రెండు సేనలలోను మరణించినవారి సంఖ్య అధికముగ నుండెను.

* * *

అడిస్ అబాబ అక్టోబరు ౧౪ —

కౌంటు విన్సిగారింకను ఆబిసీనియా వదలిపోలేదు వీరి ఆరోగ్యము చెడినదనియు స్థితి అపాయకరముగ నున్నదనియు ఒకవార్త వచ్చినది

* * * *

మాకాలిని ఆక్రమించుకొను ప్రయత్నములు

మాకాలినగరమును స్వాధీన పరచుకొనుటకు ఇటలీ సైనికులు అన్ని సన్నాహములు గావించుచున్నారు. ఇటలీ విమానములు ఈప్రాంత్యములందు తిరుగిచూచినవి. ఆబిసీనియా సేన లెచటను కనుపడుటలేదు.

* * * *

వర్షములవల్ల ఇటలీ సైనికుల దాడి నిలిచిపోవుట

ఒగడను రాష్ట్రమున ఇటలీసైనికులు గొరాహే ప్రాంత్యమునను న్నారు. గెర్లగూబి నగరమును స్వాధీనపరచుకొనవలె నుద్దేశించిరిగాని వర్షములు అధికముగ కురియుచుండుటచే సైనికులు ముందుకుపోవుటకు వీలులేక గొరాహేయందే నిలచియున్నారు.

* * * *

అడిస్ అబాబ, డిరెడావ నగరములపై బాంబులను వేయకూడదు

లండను: అక్టోబరు ౧౪:—

అడిస్ అబాబ, డిరెడావ నగరములందు విదేశీయులు అధికముగ నున్నారనియు, ఈనగరములపై బాంబులువేసిన విదేశీయులకు అపాయము కలుగుననియు, ఈ విషయమును ఇటలీ ప్రభుత్వమువారు గమనించి తూర్పు ఆఫ్రికా ఇటలీ సైనికోద్యోగులకు తగు విధమున ఉత్తరువులు పంపవలయుననియు బ్రిటను, యునైటెడు స్టేట్సు, బెల్జియం, ఫ్రాన్సు, జర్మని, ఈజిప్టు, గ్రీసు, దేశముల ప్రతినిధులు ఇటలీ ప్రభుత్వమువారికి సందేశము పంపియుండిరి

రోము నగరమునందలి బ్రిటను రాయబారి ఇటలీ విదేశాంగశాఖ కార్యదర్శి సూవిచ్‌గారిని సందర్శించి ఈవిషయమై ప్రస్తావించగ తూర్పు ఆఫ్రికాయందలి ఇటలీ సైనికోద్యోగులకు ఈ విషయమై వ్రాయగలమను ప్రత్యుత్తరమొసగబడినది

* * * *

ఇటలీపక్షమున చేరుచున్న ఆబిసీనియనులు

రోము: అక్టోబరు ౧౪ —

వెయ్యిమంది ఆబిసీనియనులు చక్రవర్తి పక్షమునుండి వీడిపోయి ఇటలీసేనలయందు చేరుటకు ఇటలీ సైన్యాధిపతి అనుమతి కోరిరని ఆడిగ్రాటునుండి తంతివార్త వచ్చినది వీరు తమవద్దనున్న వేయి తుపాకులను ఇటలీ సైన్యాధికారి కొసగిరి. అబిసీనియామధ్య జిల్లాలయందున్న షోనుజాతివారు తమకు శత్రువులని చెప్పిరి వీంబీసియోజాతి నాయకులు కొందరు ఇటలీసేనల శరణుజొచ్చిరనియు వార్త వచ్చినది.

* * * *

అడిసు అబాబా వదలిపోవలెనను ఉత్తరువు

లండను, అక్టోబరు ౧౪:—

అడిస్ అబాబలోనున్న బ్రిటిషు పురుషులు, స్త్రీలు, బాలురు ఏట్టి కోలహలము జరుపక నగరమును వదలిపోవలయునని బ్రిటిషు రాయబారి ఉత్తరువులను ప్రకటించిరి. అడిస్ అబాబలో ౫౦౦ మంది బ్రిటిషు ప్రజలున్నారు. ౨౦౦ మంది భారతీయులున్నారు. సోమలి జాతికి చేరినవారు ౫౦ మంది నార్వే స్వీడను పోర్చుగలు దేశములకు చేరినవారు ౫౮ మంది యున్నారు.

సోమలిజాతి నాయకుడు చక్రవర్తిపక్షమును చేరుట

హారారు, అక్టోబరు ౧౫

ఇటాలియను సోమలినందలి సోమలిజాతినాయకుడగు సమటారిగారు ౨౦౦౦ మంది సైనికులతో చక్రవర్తిపక్షము చేరిరట. సోమలిజాతివారు ఇటలీపక్షమును వదలి చక్రవర్తిసేనలయందు చేరుచున్నారని మరియొకవార్త వచ్చినది.

ఇటలీ రాయబారి వెడలగుట

అడిస్‌అబాబ, అక్టోబరు ౧౫

ఇటలీరాయబారవర్గమునకు చేరిన ఉద్యోగులందరు అబిసీనియావదలిపోవలయునని చక్రవర్తిగారు ఉత్తరువులనొసగియుండిరి. ఈ ఉత్తరువులననుసరించి ఇటలీప్రతినిధి కౌంటువిన్సిగారు తప్ప మిగిలినఉద్యోగులందరు జిబౌటికి ప్రయాణమైరి. రాయబారివర్గపు రెండవ కార్యదర్శి డిగెసెట్ గారు అడిస్‌అబాబ రైల్వే స్టేషనునుండి తప్పించుకొనిపోవ ప్రయత్నించిరి కాని అబిసీనియాసైనికులు వారిని వెంబడించి పట్టుకొని మరల రైలునందెక్కించి పోలీసు కాపలాతో జిబౌటికి పంపిరి.

ఇటలీ ప్రధానప్రతినిధి కౌంటువిన్సిగారు మాత్రము చక్రవర్తి ఉత్తరువును ఉల్లంఘించి సత్యాగ్రహము సలుప సంకల్పించుకొనిరి. ఆబిసీనియాయందలి కొన్నినగరములలో ఇంకను ఉన్న ఇటలీ కాన్సలులందరు సురక్షితముగ వెడలిపోవునంతవరకు తాను అడిస్‌అబాబలోనే యుండవలసియున్నదని కౌంటువిన్సిగారు తలచిరి. ఆయనచే కౌంటువిన్సిగారు, మిలిటరి ఉద్యోగికలనలు కాల్డియనుగారు ఇటలీరాయబారవర్గపు కార్యాలయస్థానమున అన్నివైపులు మూసివైచికొని లోనకూర్చుండిరి. ఇట్లు చక్రవర్తి ఉత్తరువు నుల్లంఘించినందులకై అబిసీనియా ప్రభుత్వమువారు తీసుకొనుచర్యలను సహింపసిద్ధముగనున్నట్లు వీరు తెల్పిరి. వీరున్న భవనముచుట్టు కాపలా యుంచబడినది.

నేటిదినము ఉదయము ఎతియోపియా సైనికులు, ఇటలీరాయబారవర్గపు కార్యాలయము ప్రవేశించి కౌంటువిన్సి, కలనలు కాల్డియనుగారును పట్టుకొని కాపలాతో అడిస్‌అబాబకు ౫ మైళ్లదూరముననున్న రాస్‌డస్టా అను నాయకుని యింటికి తీసికొనిపోయిరి. వీరిరువురు ప్రభుత్వమువారి అతిథులుగనుండెదరు కాని నిజముగ ఖైదీలగనుండెదరని చెప్పవచ్చును.

"సదరుస్సుదూరుహాదా"పునస్థాపన

ఈయుద్యోగమును ఈమధ్య తీసివేసియుండిరికదా కాని మరల స్థాపించెదరని వదంతిగానున్నది.

ఈయుద్యోగము "ఉమూరెమజహబి" (మతశాఖ)యొక్క కార్యదర్శిపదవి.

పేదఅభ్యర్థులకు ఫీసులేదు

మతశాఖవారు మహమ్మదీయ మతకర్మకాండ విషయమున ఏర్పరచినపరీక్షలలో చేరు అభ్యర్థులు పేదవారుగానున్నచో వారివద్దపరీక్షఫీసు తీసుకొనవలదని అవ్వలుతాలుకుదార్లకు మతశాఖా మంత్రిగారు అనుగ్రహపూర్వకముగా ఆజ్ఞయిచ్చినారు.

హైదరాబాదుఆర్థికసంఘము

ఈనెల ౧౭ ఆజూరునాడు సాయంత్రము ౫గంటలవేళ నవాబ్ హైదర్‌నవాజ్ జంగ్ బహదరుగారి అధ్యక్షతతో సమాకారసంఘకార్యాలయమున సమావేశమగును.

## రజతోత్సవనిధి ప్రజాక్షేమమునకై వినియోగించవలెను

రజతోత్సవ కార్యనిర్వాహక సంఘము వారి సిఫారసులు.

(ప్రభుత్వ ప్రకటనశాఖ)

మ. ఘ. వ. ప్రభువుగారి ఫర్మానుయొక్క అర్థము ననుసరించి, చందాలుగాను విరాళములుగాను ప్రజలనుండి వసూలుచేయబడిన నిధిలో యొక్క భాగమును యీ క్రింద చెప్పబడిన స్కీములవంటి ప్రజోపయోగములైన స్కీములకై ఖర్చుపెట్టవలెనని కార్యనిర్వాహకసంఘముచది లి అధికారులు కేంద్రరజతోత్సవ సంఘమునకు శిఫారసు చేసినారు. ఆస్కీములకు కొన్ని ఉదాహరణములేవనగా, క్షయరోగుల ఆశ్రమమొకటి, విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు, రవర్ద్రశర శాలయములు, అందరిఉపయోగార్థము వెలువు కట్టక్రింద నొక ఆటస్థలము, ఒకపోలీసుఆసుపత్రి, 3పరసాలయములు. ఒక ఆదర్శగ్రామము, గ్రామపునర్నిర్మాణము. 3 అనాధ శరణాలయములు, మీర్ జుమ్లా చెరువువద్ద అందరిఉపయోగార్థమొక వనము, 3 శిశుసంరక్షణ కేంద్రములు, ఒకకంటివైద్యశాల—యివి. ఈస్కీములన్నిటికిని మొత్తము రూ ౨౬౭౫౦౦౦౦లు పట్టునని అంచనా వేయబడినది. కాని చందాలవల్లను, విరాళములవల్లను మొత్తము యెంతవసూలగునో నమ్మకములేనందున మ.ఘ.వ. ప్రభువుగారి రజతోత్సవ స్మారకముగా అధమపక్షము యీ క్రింద చెప్పబడునంతయైనను చేయవలయునని శిఫారసు చేయబడినది.

౭లక్షల ఖర్చుతో క్షయరోగులఆశ్రమము. ౨లక్షల స్కాలరుషిప్పులు. ౧లక్ష ఖర్చుతో ఆదర్శగ్రామము గ్రామపునర్నిర్మాణము, డివిజనుకార్యాలయముండు ప్రతియూరను పరసాలయములకై ఒకలక్ష, శిశుసంరక్షణ కేంద్రములకై ఒకలక్ష; 3 అనాధ శరణాలయములకై ౧ లక్ష౫౦వేలు. దీనిలో సగము రజతోత్సవనిధి నుండి ఖర్చుచేయవలెను, మిగిలినసగము ప్రభుత్వమువారు యివ్వవలెను.

ఈశిఫారసులు యింకను యెక్కువ విదారముగా విరాళములు, చందాలునువచ్చుటకు ప్రోత్సాహమిచ్చునుగాక యనియు, అట్లు యెక్కువ వసూలైన యీ చెప్పబడిన స్వల్ప కార్యక్రమమే గాక క్రొత్త కార్యక్రమమును నడుప వీలు అవకాశము కలుగుగాక యనియు కమిటీవారు ఆశించుచున్నారు.

---



---

# స్థానిక వార్తలు

## విశ్వవిద్యాలయ పరీక్ష తారీఖులలో మార్పు కోరుట

ఉస్మానియా విద్యార్థుల విజ్ఞప్తి

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు, రజతోత్సవమునకు కొన్ని దినములు ముందే తమ పరీక్షలు పూర్తియైనచో, తాము రజతోత్సవములో పాల్గొనగలమని సూచించుచు ఎట్లు మార్చవలయునో వివరములతో నొక విజ్ఞప్తిని తమలో తాము అందచేసికొనుచున్నారు.

### అంటువ్యాధుల వారినివేదిక

౨౮ సెప్టెంబరు ౧౯౩౫తో పూర్తియైనవారములో నగరమున ౭గురికి ప్లేగుతగిలినది. వారిలో ఒకరు చనిపోయిరి. పరిసరములలో జాడ్యము లేదు. ౧౨ యిండ్లలో చచ్చిపోయిన ఎలుకలు దొరికినవి. ఆయిండ్లును యితరగృహములును శుభ్రపరుపబడినవి. మూషకసంహారము విషపుమాత్రలద్వారా బోనులద్వారా దివ్యముగా జరుగుచున్నది ఎలుకలబొక్కలు మందుపొగద్వారా మూసివేయబడుచున్నవి. ఈవారములో ౬౭౦౭ మందికి ప్లేగుటీకాలు వేయబడినవి

### క్వెట్టా భూకంపనిధి

వేయిరూపాయలు శ్రీ రాజాబహాదరు వెంకటరామారెడ్డిగారు (ఓ. బి. ఇ.) వైసరాయి నిధికి ౧౮వ మారు పంపిరి. ఇప్పటివరకు మొత్తము విరాళములు పంపినవి ౨౧ వేయి రూపాయలు.

## తాబికిస్తు చెల్లింపు తారీఖులలో మార్పు

సూబేదార్ల కాన్ఫరెన్సు ఫలితము

ఈకిస్తు తారీఖులు పూర్వము ౧ నుండి ౨౧ అమర్దాదు వరకు అని నిర్ణయమై యుండెనుకదా. ఇప్పడు సూబేదార్లకాన్ఫరెన్సుచేసి ప్రభుత్వాంగీకారముతో ఈ తారీఖుల మార్చి ౧౫ అమర్దాదు వరకు ఉంచవలయునని నిర్ణయింపబడినది.

### రేడియో కార్యాలయాధికారియొక్క సందేశము

౬ అజూరునాడు రేడియోలో విశేషము లండిష్లుడు సంచరించుచున్న మహిబూబలి షా॥ నాజముగారి సందేశము ప్రకటింపబడినది. ఫ్రాంసు మున్నగు రాజ్యములలో వీరిని గౌరవించుచున్నారనియు, రేడియో యంత్ర పరికరములను పరిశీలించుచున్నారనియు, తామిప్పటితో సుఖముగావచ్చి మ. ఘ. వ. ప్రభువుగారి సేవ చేయగల్గినట్లు అందరును ఆశీర్వదించవలయుననియు సందేశమున గలదు.

## ముస్లిము ఐకమత్యసభ

ఈ సభవారు ౫ అజూరు ౧౩౪౫ నాడు ప్రభువుగారి జన్మోత్సవ సందర్భమున సభ సమావేశపరచి ప్రభువుగారి నభినందించిరి.

## ముస్లిము కాన్ఫరెన్సు

మహమ్మదీయులందరు మత సంబంధమైన యుదాసీనతను తొలగించుటకు ఈ కాన్ఫరెన్సు చేయవలసి యున్నదని నిజామియా పాఠశాల ప్రాత విద్యార్థుల సంఘమువారు నిశ్చయించి ప్రజాభిప్రాయమును కోరినారు.

## డాక్టరులకు హెచ్చరిక

ప్లేగుశాసన నిబంధన

"ప్లేగువ్యాధితగిలిన రోగులసంగతిని వెంటనే డాక్టరు ప్లేగుకార్యాలయమునకు తెలుపనిచో నూరురూపాయల జుర్మానాకుగాని వెలశైదునగాని పాత్రుడగును. వైద్యాధికారిగాని, వైద్యుడుగాని ప్లేగువ్యాపించని ప్రదేశప్రాంతములో ఎవరికైన ప్లేగుతగిలినచో సంగతిని రోగిపేరుసహా ప్రభుత్వమువారికి తెలిపినచో అతనికి బహుమానము ఇయ్యబడును." అని ప్లేగుకార్యాలయమునుండి ప్రకటించిరి.

## నిజాం రాష్ట్రములో నిషేధింపబడినపుస్తకములు

ఈక్రింది పుస్తకములు నిజాంరాష్ట్రములోనికి ప్రవేశించుట క్రయవిక్రయములు ప్రభుత్వమువారివలన నిషేధింపబడినవి.

౧. అహవాతుల్ ఉమ్మల్ (ఉర్దూ)
౨. సంఘటక్ సంజీవక (మహారాష్ట్రము)

### శ్రీమతి సరోజినీదేవిగారి ప్రయాణము

మద్రాసులో జరుగుచున్న వర్కింగు కమిటీలో పాల్గొనుటకై వీరు ౭ అజూరునాడు హైద్రాబాదునుండి వెడలినారు.

### అబ్కారీనాజం రాక

మౌ. గులాం మహమదు ఖురేషిసా॥ మద్రాసునుండి తిరిగివచ్చినారు. వీరచ్చట ట్రైనింగు కొరకు వెళ్లియుండిరి. వీరు అబ్కారీనాజము ఉద్యోగముపైన ఏర్పడబడి యున్నారు.

### తహసీలుదార్ల ముస్తఖిలు

నూబేదార్ల సిఫారసు ననుసరించి. ౧౩ మంది (తాత్కాలికముగా నియోగింపబడిన) తహసీలుదారులు ముస్తఖిలు చేయబడినారు

### మౌ. అబ్బాసు అబ్రహమ సఈదు సా॥ తహసీలుదారు ఉద్యోగమునుండి తొలగించబడుట

తహసీలుదారు ఉద్యోగమునకు ప్రొబేషనరుగా పనిచేయుచుండిన ఈయన నాగ సంపన్నరముల సెలవుకై దరఖాస్తుపెట్టి అంగీకారమునకై వేచియుండకయే ఇంగ్లాండుకు వెళ్ళెను. ఈతని వర్తనను అక్రమముగా భావించబడి ఉద్యోగమునుండి తొలగించబడినాడు.

## సాయంకాలము ఎద్లబండ్లు రాగూడదు

ప్రభువుగారు నగరములోనికి వెళ్లుచుందురు కనుక సాయంత్రము ౬ గంటలనుండి రాత్రి ౧౦ గంటలవరకు కోఠిపైన ఎద్లబండ్లు రాకూడదనియు. ప్రొద్దుటిపూట పెద్దబండ్లురాకను అటంకము కలిగించవలదనియు, సర్కారు అధికారుల ఎద్లబండ్లు కూడా సాధారణ నియమములే వర్తించునుకొనివారివిషయమున అధికారమేదనియు పోలీసు కొత్వాలిమహాశయులనుండి ఆజ్ఞ జారీఅయినది

### హైద్రాబాదు అఫ్గనుల సభ

హైదరాబాదులోని అఫ్ఘనులు ౮ అజూరు ౧౩౪౫ నాడు రసవారి సభ జరిపి మ. ఘ. వ. ప్రభువుగారియెడ భక్తి విశ్వాసములు ప్రకటించిరి. మూడు వందలమంది బీదల కన్నదానము చేసిరి.

### ౯ సంవత్సరముల బాలునికి శస్త్రచికిత్స

డాక్టరు నవాబ్ రుస్తుంయార్జంగు బహాదరుగారి ఒక కొడుకకు ౪ అజూరునాడు శస్త్రచికిత్స ఉస్మానియా దవాఖానాలో జరిగినది. ఈసందర్భమున బొంబాయిలోని ప్రఖ్యాత శస్త్రవైద్యుడను డాక్టరు సర్జరీ గోపాలు మండిరి.

### రజతోత్సవ సందర్భమున జమనౌటసాహెబ్

పెషేకారు నొక సంచిక మన ప్రభువుగారి రజతోత్సవ సందర్భమున ప్రకటింప బడునని యు అన్నికభువుగారిక ప్రత్యేకముగా అర్పింప బడుననియు, దీనిసంపాదకులు మౌ॥ మహమ్మదు యూసుఫుసా॥ అనియు, ప్రధానమంత్రిగారి పోషకత్వము ఈసంచికకు కలదనియు తెలియుచున్నది

# 'గాంధీతత్వము పోవుగాక!'

కాంగ్రేసునాయకుల నాదరించిన కేకలు

కాంగ్రెసు నాయకులు నవ్వుకొనుట

బెజవాడ వార్తలు

(స్వకీయ విలేఖరి)

బెజవాడ అక్టోబరు ౧౪

## కాంగ్రెసు అధ్యక్షునికి స్వాగతము

కాంగ్రెసు అధ్యక్షులగు రాజా రాజేంద్ర ప్రసాద్, కార్యసంఘసభ్యులు డాక్టరు పట్టాభి సీతారామయ్య శ్రీమతి సరోజనీనాయుడు, వల్లభాయిపటేలు, జమ్నాలాల్ బజాజ్, ఆచార్య కృపాలినీ, బులాభాయిదేశాయిగార్లు వార్ధానుండి మదరాసు పోవు గ్రాండు ట్రంకు ఎక్స్‌ప్రెస్‌లో ఉదయము ౧ గంటలకు బెజవాడ చేరిరి రైలు స్టేషనులో వేలాది పురజనులు స్వాగతమిచ్చిరి గుంటూరునుండి వచ్చిన శ్రీయుత కొండా వెంకటప్పయ్య పంతులుగారును నగర కాంగ్రేసుసంఘము పక్షమున అధ్యక్షుడు అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారును నాయకులను సన్మానించిరి. పలువురు పండ్లతోను, పుష్పహారములతోను బహూకరించిరి మహాత్ములేని భారత ప్రజాచక్రవర్తికి యిట్టి బ్రహ్మాండమగు స్వాగతము నిచ్చుటలో ఆశ్చర్యమేమున్నది' "కాంగ్రెసుకుజై" "గాంధి మహాత్మునికి జై" అను జయజయ ధ్వానములు చెలరేగెను కాని ఆ సమూహములో కొందరు నాస్తికులు మాత్రము, "సామ్రాజ్యకాంక్ష నశించుగాక" "గాంధితత్వ మదృశ్యమగుగాక" అని బిగ్గరగా కేకలిడగా నాయకులు విని నవ్వుకొనిరి.

### మూంజీగారి ఉపన్యాసము

ఒక్టోబరు ౧౦ తేదీ గోలకొండ పత్రికలో డాక్టరు మూంజిగారి ఉపన్యాసమందు అఖండ హిందూస్థానమునకు "గాంధగాం" దేశమని పేరబెట్టవలె నని అచ్చుపడినది కాని ఆప్రాంతము "గాంధార" దేశముకే. కాందహార్ అని పిలువబడుచుండెనని చదువవలెను

### "ఆంధ్రవార్త" ప్రాశస్త్యము

బెజవాడనుండి "ఆంధ్రవార్త"యను తెలుగు దినపత్రిక క్రమముగా వెలువడుచున్నది సానికొంగ్లవారపత్రిక "గోష్ఠి" సదరుపత్రికను ఇట్లాహ్వానము చేయుచున్నది "తెలంగాణా ఆంధ్రుల ఆంతరంగిక సహకారము, రాయలసీమవారి సంపాదకత్వము, సర్కారువారి యాజమాన్యము మూడ ఆంధ్రవార్తలో త్రివేణీ సంగమమును పరికించు ద్యోతకమగుచున్నది అంద్రాభ్యుదయమునకును అంధ్రసంస్కృతి నిర్మాణమునకును యీ పత్రిక తోడ్పడుగాక"

### కాంగ్రెసు చరిత్ర

సుప్రసిద్ధాంధ్ర నాయకులు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు రచించిన "కాంగ్రెసు చరిత్ర"ను భారత కాంగ్రెసు కార్యసంఘమువారు డిసెంబరులో ప్రచురణ ప్రారంభించెదరు ఈచరిత్ర అన్ని దేశభాషలలోనికిని తర్జుమా యగుచున్నది తెలుగులోనికి ఆంధ్ర వాస్తవ్యులు శ్రీ కొడాలి ఆంజనేయశర్మగారు అనువదించుచున్నట్లును, దానిని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రచురించెదరన్నట్లును తెలియుచున్నది కాంగ్రెసు చరిత్ర పూర్తికాగానే పట్టాభిగారి ఖ్యాతి యాంధ్రదేశములోను విస్తరించి కాంగ్రెసు అభ్యర్థులకు అవకాశము లభించునని తోచుచున్నది

### క్రొత్త ఇన్స్యూరెన్సు కంపెని

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి నాయకత్వమున "హిందూస్థాన్ మ్యూచువల్ లైఫ్ ఇన్స్యూరెన్సు కంపెనీ"ని యిందరులో స్థాపించినారు నవంబరు నెల ప్రారంభములో బీమా వ్యాపారము ప్రారంభించెదరట

# ఆంధ్రులు పాలక జాతివారు

## ఆంధ్ర మహారాష్ట్రుల అన్యోన్యత

### మూంజీగారి ప్రశంస

(స్వకీయ విలేఖరి)

బెజవాడ సెప్టంబరు ౩౦

ఆంధ్రరాష్ట్ర పర్యటనమును ముగించుచు డాక్టరు మూంజీగారు ఆంధ్రులకిట్లు సందేశమునిచ్చిరి —

"ఆంధ్రులు సామ్రాజ్య జాతికి చెందినవారు వారు యుద్ధవీరులు. ఆంధ్ర సామ్రాజ్యమున్నతదశలో నుండగా, ఆంధ్రులు మహాపౌరుషముగల యుద్ధ సైనికులుగ నుండగా, నామహారాష్ట్రమువారి ఆధిపత్యముక్రింద నుండెను. కానికాలచక్రవశమున పరిస్థితులు తారుమారై మహారాష్ట్రులు సామ్రాజ్యము నేర్పరచుటయు అందు తెలుగుసీమభాగముగ నేర్పడుటయు తటస్థించెను ఈవిధముగ ఆంధ్రులును, మహారాష్ట్రులును చారిత్రాత్మకముగ అన్యోన్య సంబంధీయులైరి నేడు మహారాష్ట్రులు తమ పూర్వౌన్నత్యమును సంపాదించుటకై యత్నించుచున్నారు పాలకజాతివారైన ఆంధ్రులు కూడ తమసైనిక సాంప్రదాయములను పునరుద్ధరింపవలెను అందునకై ఒకలక్ష "రామదండును" నిర్మించుటకై తెలుగువారు సిద్ధపడవలెను ఇట్లు చేయుటవలన ప్రపంచములో స్వతంత్ర జాతులెల్లు పౌరుషప్రభావములతో ఖ్యాతిగాంచుచున్నారో అటులనే మన ఉభయ రాష్ట్రీయులు స్వతంత్రప్రజ్ఞను గణించి భారతజాతికి స్వేచ్ఛ స్వరాజ్యమును సంపాదించి యివ్వగలము."

ఇటులనే యిదివరలో లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుడు కూడ మదరాసులో తెలుగువారి సన్మానమునకు ప్రత్యుత్తరమిచ్చుచు ఆంధ్రుల ప్రజ్ఞా పౌరుషములను పొగడియుండెను "మహారాష్ట్రులు ఆంధ్రులనుండి రాజనీతిశిక్షను గ్రహించియుండిరి" అని వచించెను

